# శ్రీ ధర్మవరప్పు సీతారామాంజనేయాభిధా!

## ఆశీః

నా పేరు శాశ్వతంబుగను నాల్గు కాలాల పాటొప్ప
దీపింపఁజేయవే యనిన, దీని నీ పేరఁ బెట్టెదన
యీ పుస్తకము నిల్వవచ్చు వృత్తవైశిష్ట్యంబు మహిమ,
గోపి యీ దైవభావనయు నొనర్చింప నూహింతువేని.

మనపేర నొక్క గ్రంథమ్ము మఱి యచ్చుపడె నన్న మాత్ర
మనసుబ్బు కననేల? దాని మహిమ ప్రాణముల జీర్ణించు
కొనవలెఁ గాక, నీ పేరు కూర్పించుకొనినంతఁ గాదు
మనసులో నీ దైవములను మసలించుకొమ్మ, నావలెనె.

నీనుగా ధర్మవరంపు వేంకటసుబ్బయ్య కృష్ణ
వేణమ్మల కడుపునఁ బ్రభవించిన దానికి ఫలము
గా నాదు మధ్యాక్కఱలను గల గాఢభావన చేయు
గా నిచ్చు మాట, నీ పేరఁ గడఁగి పెట్టించుకొన్నావు.

ఎందుకో యభిమాన మిదియు నీరీతి నీపైన నాకు
పొందింప నంగీకరింతుఁబో, దీనిపైన నీపేరు,
నందించుకోఁ బ్రాణములను యత్నమ్ముసేయు మీ దైవ
సందోహమును, జన్మ యిద్ది చరితార్థ మౌనట్లు గాఁగ.

విశ్వనాథ సత్యనారాయణ.



ధర్మవరపు సీతారామాంజనేయులుగారు

కారంచేడు _ గుంటూరు జిల్లా.

# విశ్వనాథ మధ్యాక్కఱలు

## శ్రీగిరి శతకము

శ్రీనీరధి నిషంగ, భక్తజనతతి శ్రేయోఽనుషంగ !
మానాథశరసంగ, ప్రౌఢ వృషభరాణ్మద్యత్తురంగ !
క్ష్మానూతన శతాంగ ! సంగతోష్ణీష సౌరాంబుభంగ !
శూలాభిషంగ ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ 1

నాలోన శుష్కతృణంబు ముట్టించినావు దృగ్వహ్ని
నీలలోహిత! దైన్యభావనా మంజులోహిత ! నీవు,
జ్వాల తానదివేఱు, నిద్దివేఱుగా సంతరించకువే
శూలాభిషంగ ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 2

నాలోన నెంతగాఁ ద్రవ్వుకొన్న: బినాకి! కన్పడవు
ఆలోకరమణీయ శారదాంభోధరాస్నిగ్ధమూర్తి
నీలోనఁ ద్రవ్వి నీలోఁతు తెలియఁగా నేర, నిన్నెంచి
సోలిపోఁజాల శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 3

నాతల, సర్పమంజీర! నీ పాద నాళీకమందుఁ
బ్రాఁతిగా నిచ్చలు, నడుము వంచుచు వ్రాల్చినయట్లు
చేతోఽంబుజాతంబునందు నాకు భాసించుచుండెడిని
జోతలుగాఁగ, శ్రీశైలమల్లికార్జున మహాలింగ! 4

ఆ మానసికమైన మూర్తి, అట్లు నిరంతంబుగాఁగ
స్వామి! దీపించుచునుండి, కొంతలాభంబు కావచ్చు
ఈ మేనె శిలగాఁగ నచట నున్నచో నెల్లకాలంబు!
సోమకిరీట! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 5

నా గుండె తీసి నీ పాదమూలంబునం బెట్టుమనుము
మాఁగువారిన శ్రద్ధ సుంత మసలిన మార్పేరఁబిలుము
ఊగులాడితినేని వందజన్మ లిట్లాగకు! నీదు
జోగిని నేను! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 6

నేనెంత ! నా బ్రతుకెంత ! సృష్టిలో నిజము నావంటి
మానవుల్ మూఁడుకాలములఁ బుట్టుచు మడియుచున్నారు
కానగా సర్వదేశములయందు, జగంబొక పెద్ద
సూనాపణంబు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 7

కోరి, కబేలాకు, మందగాఁ దోలికొనిపోవుచుండ
దారిప్రక్కనయున్న పచ్చి గడ్డిపైఁ దారాడుపసుల
తీరుగానున్నది జనుల భోగాశ ! తెలివి సర్వమ్ము
చూఱపుచ్చెదవు, శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 8

మానసంబింతయుఁ గొల్లవోయి నీ మహనీయమూర్తి
లోని వెల్గు, పిసరుతో చనీనంత లోఁకువై పోతి
వీనినిఁ బెట్టెడుబాధ వేనినిఁ బెట్టవు నీవు
సూనాస్త్రవైరి ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 9

ఒకతెల్లగా వత్తువో యటంచు నేనొగి నిశీథముల
ముకుళించుకొన్న నెన్నుదురు నడుమ నీమూర్తికై వేతు
నకట ! తానరుదెంచు నంధకుఁడు, వాని హరియింపనంత
సుకరంబుగాదు శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! 10

తనివితీరగ నిన్ను రెండుచేతులఁ దాఁకగావచ్చుఁ
గనులఁ ద్రోవఁగవచ్చు నిన్నుఁ గౌఁగింటఁ గ్రుచ్చుకోవచ్చు
నునికినున్నట్లుగా వచ్చి మడిలేకయును గొల్వవచ్చు
సునిశితబుద్ధి శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 11

అప్రౌఢి నింద్రియంబులు వడిగ నింద్రియార్థంబులందు
నా ప్రయత్నములేక సాగుచున్న వాగ్నాయీ ప్రియాక్ష!
నా ప్రార్థన ఫలంబులగుత సర్వాఘ నాశంబు నీదు
సుప్రసన్నతయు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 12

ఇప్పటి నాస్థితిఁజూడ నెడఁదలోఁ గోర్కెలేమియు వెలికిఁ
గుప్పించి దూఁకెడు జాడలేద మేనొక్కెస బర్వ్యాగాఁగ
నప్ప ! యూహకు నందకుండఁ దెలియదయా జీవుఁడేమి
చొప్పుగలాఁడో శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 13

ఇది తపోయోగ్యమా తనువు నాచేత నెత్తించలేదు
ఇది భోగయోగ్యమా తనువు నాచేత నెత్తించలేదు
మది భోగవాంఛ కన్పడదు వేఱుజన్మ తపఃక్షమమును
కొఁడమాలియైనావె శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 14

వేదాంతములలోని వేదములలోని విమలార్థచయము
వాదించు నాద్వైత, వానిశ్రుతుపై వరలుచునీజగ మ
నాదిబంధుఁడ వీవునిద్దఱుంగూడ నన్ను వేర్పరుపఁ
బ్రోది నాకేచటి శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 15

అఖిల జాగ్రదవస్థయందు స్వప్నావస్థయందు
జీవుని యనుభవభేద మింతగాఁ జెందియునొకఁడె
జీవాత్మ పరమాత్మయట్లె భేదమ్ము చెందియునొకఁడె
ప్రోవైన తెల్వి శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 16

అది యుత్తమము నీవు మధ్యమమును నేనధమమ్ము స్వామి
మదిఁ జిత్రమయ్యె నీ మధ్యమత యుత్తమత వంటిదయ్యె
నదిర నాయధమత నీదు మధ్యమ తాంశ లేదాయె
సోదవేడు వినుము శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 1

కనుమూసినంత నీగర్భగుడిలోన కన్పించుచుంటిఁ
గనఁగ నేనేనాకు నింద్రదలీల లింగంబు ముంగలను
తనువువంచి శిరంబు పానవట్టంబు దగ్గరఁ జేర్చి
సునిరతమూర్తి శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 18

అట వ్రాలియున్నట్టు లభవ యూహించినప్పుడే నా సు
ఘటన నిత్యమ్ముగా నున్న దామాయ క్రమిమ్మ నేనెఱుగ
నటులైన నీనిత్య సన్నిధాన ధైర్యము వహించెదను
స్ఫుటముసేయఁగదె శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 19

అటు వ్రాలియున్న నా వీపుపై నెంద రభవ త్రొక్కెదరో
త్రుటినైన నొకబాధ కలిగినట్లుగాఁదోచదునాకు
నిటలాక్ష నీసన్నిధియును నీసేవ నెరయు వేఁడి తఱ
చుట తోచనీదా శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 20

త్రొక్కిళ్ళ నెక్కిళ్ళ మఱి దిగుళ్ళ నీధూళి దర్శన మ
దొక్కసారిగ శ్రమయంతయుం జోపునోయి మహేశ!
స్రుక్కిపోవుచు నెండ నడచి పెనుమ్రి సులభశీతలతఁ
జొక్కెదునట్లు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 21

అనుభవ పరమార్థ హీనభావమ్ము లవి యెల్లఁగూర్చి
తనర వారును వారు చెప్పినట్టి శబ్దమ్ములర్థముల
నిను నేనుబొగడ నీ పెదవిపై నవ్వు నెరసు చూపవును
సునిభృతహాస శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 22

నాగుండె పెకలించుకొంచు నా ప్రాణనాళముల్ చీల్చు
నాగర్ధములతోడ నిన్నుఁబిలువ నీ పరను నిశ్చలత
లో గీఱగా సన్నతరగవలె నీలలోహిత కదలు
సాగ కన్పడునె శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 23

స్వామి నాలోనేను గుబ్బిసాడి భావము లుబ్బవలయు
నీమేలి కదలికలోని క్రొవ్వెల్లు నీరధిలోన
నేమేమొ తరగలు లేవవలయునా యని నేనుగాఁగ
సోమించవలయు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 24

సర్వతర్కంబులు సర్వశాస్త్రముల్ సంస్కారమిద్ది
శర్వ ! యనాదిగాఁ జెప్పు మఱియును సాంతంబుగాఁగ,
పర్వదు పొసగింపు నాకు దానితోఁ బనియేమిలే య
జుర్వేద వినుత! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 25

తొలివెలుంగా నీవు నన్నురక్షింపఁ దూగుచున్నావు
కెలనఁ జేరినయట్టి కొన్ని గ్రహములు కిట్టులువెట్టుఁ
దలచిన యుపకృతి భావమునసుండి తగ్గిపోవకువె
సులభఘృణాక ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 26

అంత దట్టమ్ముగాఁ గ్రమ్మియున్న యీయంధకాసురుఁడు
కొంతగా నప్పటప్పటికి నీశూలకోటి ఘాతములఁ
గ్రంతలు తూట్లైన మేనఁగన్పించుఁ గన్పించకుండ
సుంత, మ్రందించు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 27

మనసులోపలఁ ద్రవ్వి నిన్ను వెలిఁదీయు మాదిరి కాక
తనగుండెలోనుండి నీవుగా మనోదర్పణంబునను
గనుపించు నేరుపు కలుగునట్లుగాఁ గలిపింపవే క
రుణ కాల్వకట్టి శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 28

జ్ఞానాగ్ని దగ్ధ కర్మలని కొంత యాశాద్యోతకముగఁ
బూని చెప్పుటకాని యీశ ! ప్రారబ్ధమున్ వీడ వెపుడు
లేనిలే దాగామి సంచితంబు కాలినబొగ్గు, పరమ
సూనృత తేజ ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 29

నిముసంబు లవి వేనియందు నాబుద్ధి నీమీఁద నిలచి
భ్రమియింపకుండునో యవ్వి చాల స్వల్పపు సంఖ్యకలవి
తమముతక్కినయవియివ్వి వెలుఁగన్న ధైర్యము కాక
సుమనస్స్వరూప ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 30

అలసి ధీవరుఁడై నవాడు మరి దేనినైన గ్రహించు
తలఁపుతో వల వేయు నీవు వేసిన దయలేని మాయ
వల, దేనికని వేసినట్లు? జీవులు వణఁకిపోవుటకు
సొలసిపోవుటకు శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! 31

కేవల యోగ్యాదిసరదనుపలబ్ధి కృతవాదసరణి
లేవని యున్నావటంచుఁ జిఱుధూళి లేపుట యది, య
భావమ్ము చెప్పుటకాదు, కృచ్ఛ్రలభ్యత వచించెదు, య
శోవేద్యమాన శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 32

సూరిమనోవేద్య పడగ పగ పాము చుట్టమన్నట్లు
తూఱి నిన్ నీవు లేవనుచుఁ దెగఁజెప్పుదురు నిల్చుఁగొలుచు
వారిఁ బ్రహ్లాద ముఖ్యులను బిట్టుసంభావింతురేమి
చోరలక్షణము శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 33

విడతలు విడతలుగాగ భావనావేశంబు తెత్తు
వడియున్న యప్పుడు గుండెలోపలఁబట్టి పాలార్తు
విడిపోయినప్పుడు దీనుఁడై యెంత పిలిచినరావు
సుడియాడినట్లు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 34

ఒంది మోదము, చెప్పినట్టివా ర్చెప్పకుండఁ జెప్పెదరు
చెంది చిదంబర వీధిలో నీవుచేసినానంద
కందలాస్యమ్ము, సత్పదనవార్థాభిఘటనంబు పరమ
సుందరమూర్తి శ్రీశైల మల్లికార్జున మహాలింగ !

మాటల క్రొత్త యేమున్నదో స్వామి మరి నా యెడంద
గాటంపు బాధయే యిచ్చుటం క్రొత్తగాని, తానింత
పాటిబాధయు క్రొత్తగాదునా, నీ కృపాదృష్టి క్రొత్త
చోట నాయందు శ్రీశైల మల్లికార్జున మహాలింగ !

ఊరక యుండినవానిఁ గొనిపోవు టొక సంతలోనఁ
గూరుచుండఁగఁ బెట్టులే పదార్థంబు కోరరాదనుట
కోరినచోఁ దలకొఱవికొని తెచ్చికొన్నట్లెయేమి
శూరత్వమిద్ది శ్రీశైల మల్లికార్జున మహాలింగ !

ఈవె పోయితి సంత చూతమనుచు నాదేమున్నదనెదొ
యీవు వచ్చితివట్లె వచ్చినావు నాయీ పెత్తనంబు
కైవసంబును జేసికొంటి. వందుచేఁ గైమోడ్తు నీకుఁ
ద్రోవచూపుమని శ్రీశైల మల్లికార్జున మహాలింగ !

ప్రతిదినంబును సూర్యుఁ డస్తగిరిపైనఁ బవ్వళించెడిని
బ్రతుకులో నేదియో పెద్ద బరువైన పగిది భాసించు
శితికంఠ! నాగుండెమీఁద నృత్యమ్ము చేయుదో యేమొ
చ్యుతసంధికముగ శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 39

స్నానంబుచేయుచుఁ దుడుచుకొంచును జపముసేయుచును
ప్రాణాలు తేలిపో నీవు కనిపించు భాగ్యమున్నదియె
యీ నాకటంచు నేనెంతగాఁ దపియింతు నీవెఱుఁగు
ఛో నాకుఁజాలు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 40

ఒకచోటఁ గూర్చుండి నిన్ను నూహింతునో యన్న నన్ను
నొకచోటఁ గూర్చుండ నీదు కవిసైన యొక దోసమొప్పి
యొకచోటఁ గూర్చుండ నీదు సంసారమో స్వామి! పూర్వ
సుకృతంబు లేదు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 41

ఈ మేని త్రాసుతోఁ దూచుచున్నాన యీవైపు మొగ్గ
స్వామి క్రమమ్ముగాఁ దగ్గిపోయె భవద్దిశకొగ్గి
యీ మేను కాకిక బరువు లేదాయె నీవె తూఁగెదవు
సోమకిరీట! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 42

మున్ను లింగాకారమైనఁ గన్నులు మూసినయంతఁ
గన్నుం బొమ్మలమధ్య జోతిమాదిరిఁ గానిపించెడిది
యున్న తెలివిపోయెఁ జదువ వేయగా నొగి నన్నయట్లు
సున్నయైనావు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 43

అచ్చపుఁదనములోఁ గరుణ దిగజారెనన్న నీమాట
తెచ్చిన గుండెకుఁ గరగి కన్నీరు దిగఁజారు నింత
పచ్చియైన మిగుల్చు పాటియున్నావు బ్రదుకులోపలకుఁ
జొచ్చినదారవు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 44

గవుసెనపడిన నీమూర్తి కనక, నూకల కేడ్చియేడ్చి
తవుటి కేడ్చినయట్లుగాఁగ జివరకుఁ దమరి నూహించి
యువిదయు గుండియయైన లేనియట్లుగా నగుదునో యంచు
సువిపాటయయ్యొ శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 45

నీ వచ్చుటెచ్చుటో నాదు శిరసుపై నెగడుచుంటివని
యావేగపడుకొంచు నాదు మేనిలో నాడు నెత్తురులు
నో విశ్వనాథ! తామెదురు ప్రవహించుచున్నవి పైకిఁ
గ్రోవి చిమ్ముగతి శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 46

మరియు వైరాగ్యంబు మరియు దేహాభిమానంబు మరియు
మరియు వైరాగ్యంబు మరియు మరియు నిన్ మరుగు
చొచ్చుటయు
విరిసిపోదునో యన్న భీతి నీవు నన్ విడఁద్రోక్కుదనియు
సురిగిపోమెదను శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 47

ఒకటి నిశ్చయమయ్యె బయట నెచ్చటనుండియో నీవు
ప్రకట శైవానేక కథలలోని రూపాలతో రావు
ప్రకట మత్ఫాలంబు ఫట్టుమంచును బగిలిరావలయు
సుకమొ దుఃఖమొ శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 48

మేలుకొన్నప్పుడు పట్టుకొంచుంటి మెదలకుండంగ
నీలలోహిత ! మేలుకొనెడి కోరికల్ నిద్రించుచుంటే
పాలించవే నాకు నిద్రలేకుండ భసితరమాంగ్యగ
శూలాభిషంగ ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 49

కలితకపాల హారా ! మహాభాష్యకార మంజీర !
దళితాఘసంతానపరిణతస్విన్న దర్పాంధ కార !
మిళితాంధకారవైరిఘటితోష్ణీష మీలన్మనోజ్ఞ
సులలితాకార ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 50

ఈమేను కర్పూరమట్లు హరియింప నీకువే నీకు
స్వామి నీరాజనం బెత్తినట్లుగా జ్వలియింపనీవె
కోమల పరిమళవ్యాప్త దశదిశా కుహరంబుగాఁగ
సోమాంగభంగ! శ్రీశైలమల్లికార్జున మహాలింగ! 15

నినుఁజూడకుండగా మాటనేర్చుచే నినుఁజూచినట్లి
నినుచు పూర్వ కవీంద్ర వాక్యసరణి వర్ణించుటయెల్ల
నను నేన మోసంబుచేసికొనుటకోనాగ నాగాహి
సునిభృతబంధ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 52

నిదురయొఱుంగని నీవు నాలోన నిదురపోయెదవు
కుదిలించి గగ్గోలుచేసినను మేలుకోవు నిజంబు
నిదురైన మేల్కొల్పవచ్చు నీదొంగనిద్దుర కేమి
రొదచేసి ఫలము, శ్రీశైలమల్లికార్జున మహాలింగ! 53

ఎడఁద నాయది దూదిపరుపా కదలక యింతసుఖంపుఁ
బడక యేర్పడ్డది నీకు, నాయెదఁ బన్నినమాయ
యుడియించదుగదయ్య నిన్నుగూడ, నా యీదోస మింత
సుడియించు నన్నె శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 54

నినుగుండెతో రాచి నొవ్వకనకుండ నీమీఁద వట్టి
కునుకుమాట లిఖింపనంచు మతిచేసికొంటి, నీలోన
ననుచుకొందువు నిన్నునీవ, గుండెలోనన్ ఆపుపొందు
చును ఆపుకనవు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 55

ననుపుకాడవు నిశానిద్ర యెరుగవు నావలె నీవు
కనిపించినప్పుడు నీవు రాలేదుగద యన్న, నేను
చనుదెంచితిని నిద్రపోవుచుంటివం చనవచ్చు, తొలచు
చునె యేమియనరు ? శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 56

నాయూహ నా గుండెలోని కదలిక నా బ్రదుకెల్ల
పాయని యీ మేనిమీఁద నాధారపడియుండె నభవ
నా యీ తనువుచేసినావు రాయిగ నను జొరలేవు
సూయాణముగను శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 57

అరయ నాభావనాశక్తి కవధిలేదాయె మిక్కిలిగఁ
బెరిగన విఱుగుట యరుదె యేదైన వృషభరాహ్వాహ!
పరమమహా నీదు నిశ్చల మహాస్పర్శ భావనాశక్తి
సురుగఁజేయఁగదె శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 58

పెరిగి బుద్ధులు నేర్చికొను జగము తమ పెద్దలవలన
పెరిగిన తరువాత నాప్తవాక్యము విషమయిపోవు
నరయ నీయునికికి నెల్ల నాప్తవాక్యము ప్రమాణమ్మౌ
సురలోకవంద్య శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 59

ఎండిన మతికిఁ బ్రమాణశతశత మెక్కుడు నీకుఁ
బండినమతి కాప్తవాక్య మొక్కటి పరమప్రమాణ
మెండు పచ్చిమనస్సు లెంతవాదించు నిల దండితోగ్ర
శుండాలదైత్య! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 60

కలిసివచ్చినవాఁడు జగము పౌరుషకలనమం చాడు
కలిసిరానియతండు లోకమిది దైవఘటనయం చాడు
తెలివి వేయువిధాలు, తేల్చివేయుట తేలిక నిన్ను
సులభమార్గమ్ము శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 61

ఏది మొత్తైననేమి మరి నే మార్చుటింతయు లేదు
నీదయ యనుకొంట లోఁదప్పేమి నేనెఱుంగ నినుఁ
గాదని పోడిచివేసినది యేమి యాఘటకుండు తుదకు
సోదెలో రాడు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 62

తనలోనఁ దన్నుఁదాఁ జూచికోఁబోక తనకంటె నితర
మునయందుఁ దన్నుఁదాఁ జూచికొన్నట్లు మురిసి తానదియ
యనినట్లుగ స్వయంప్రతారణముసేఁత యలవాటుపడి పి
శునజాతి యాడు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 63

ఎవరిదాఁకనో యేలనయ్య నీమీద నెద నిల్పలేక
యవ్వర వారును వీరు నిట్టివారును నట్టివారంచు
తవులు మానినగుండెతోడ శివ! పెడదారిఁ బట్టెదను
సువిచారమూల! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 64

ప్రియతమ తేజ నాగుండె నీనుండి బెసకనీయకు వె
దయమాలి తనుకొను బెసకిపోయిన దండింపుమయ్య
యయయొ నీదండనమద్ది క్రొత్తయూ యల్పమూ భావ
సుయమ గూఢాకార శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 65

అటు సుఖావధివౌచు నీవు, దుఃఖాని కవధినై నేను
ఘటియించు దుఃఖంబు చివరజ్యోతివై కన్బొమల్ నడుమ
మొటకరించుచునుంటి గుండె యటమటింపులయుఁ గనీనటి
జోటజోటమూర్తి! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 66

నిరతిశయంబు దుఃఖంబు సాధనానియతి నేర్పఱచి
నిరతిశయంబు సౌఖ్యంబు నీమూర్తి నిభృతంబు సేర్తు
పరమ కాఠిన్యమో పరమదయయో స్వభావంబు నీది
సురుచిరమహాస! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 67

కదలక మెదలక యంత నిశ్శబ్దఘటనగా నుందు
మదిలోన నెంచినమాత్రలో సర్వమహిమ భాసించి
యెద దూసికొనిపోదు దూసినమ్ము సాహిత్యమ్ము కలవు
రోదలేనియమ్ము శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 68

క్షితిలోనఁ బ్రత్యర్థితోడ యుద్ధమ్ము చేసెద రభవ!
శితికంఠ! భక్తులతోడ యుద్ధమ్ము సేసెద వీవు
అతిదయాక్షీరాంబునిధివి పిల్లలమని గుండె మాకు
శ్రుతిచేసికొంటి శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! 69

అనుభవ పారమ్యమందినపుడు బ్రహ్మానందపరిధి
వని చెప్పుచుందురుగాని యవునుగా దది యుమాజాని !
మనసులోనఁ దలంచుమాత్ర మధుపరీమళ రేఖ యెడఁదఁ
జొనిపనట్టులగు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 70

ఇలసుఖార్థులు గడ్డితించు కుధనులై యొకదొట్టులేలొ
తలపులోపల నీవు నువ్వుగింజంత తారాడ నొడలు
పులకరించెడు గుండె పరమ నిర్వాణముంబొందు నింత
సులభసౌఖ్యమవు శ్రీశైల మల్లికార్జున మహాలింగ 71

లౌకికంబయినట్టి సౌఖ్యలేశంబు లభియించు వ్యసని
తాకారణంబుగా వ్యసనభావంబు తమరిపై మలచఁ
దేఁకువ సౌఖ్యంబు తెచ్చి నిలువుగాదెల నింపవచ్చు
శోకావనోద! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 72

నిన్నుఁగూర్చిన యూహ కాగడావోలె నిలచి కాలెడిని
మున్ను సమృద్ధిగా నాముదంబును బోసితివేమొ
సన్నుతావిచ్ఛిన్న తైలధారాసుసాంతత్య మొప్ప
చున్నట్టులుండె శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 73

అన్నియుం జక్కగా జరుగుచున్నప్పు డభవ! యా మృత్యు
వన్నది సహజమైనట్లు దాని భయంబు లేనట్టు
లున్నడి, యదివచ్చినప్పు డీరీతినుండఁగాఁ జేయు
సున్నితంబుగను శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 74

నీవు లింగాకార మూనుచే ధారుణికి నీ యధార్థ
భావంబు వ్యాఖ్యాన పరచునట్టులు పరమ పూర్ణతయు
నావలఁ గోలగా జ్యోతివగుట నిరాకార పరిధి
సూనె నీవగుట శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 75

నను నే విచారించుకొనిన నవ్వుగా నాకెయున్నయది
నిను సమభ్యర్థించు పద్ధతి, సుకృతి నీరేజ మధువ!
ధుని సముద్రునిఁ గోరవచ్చుఁ బెనుకొండ తూగుటేలో వ
రుణ దేవుగూర్చి శ్రీశైల మల్లి కార్జున మహాలింగ! 76

నాబిడ్డ యీ కైత, పాప మిదికూడ నగజాత, స్వామి!
జాబాలిమైత్రావరుణి మొదల్ ఋషుల్ సంబంధమాడ
రాఁబోరు నా మాటమీఁద దీనిని గ్రహియింపు మిదియె
సోబానకూడ శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 77

వియదాదిక బృహత్తనూ! శివా! పట్టువిడుపులు గల్గు
దయయేమి దయభవా! సతత సురవారిధారాభిషేక
మయమైనఁగాక యీ కరుణ యేరీతి మన్నింతు నభవ
సువహా కాదయ్యో శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 78

ఆలోల కల్లోలితామ్మయాకృతి యారెండునాళ్ళ !
నీలలోహిత తీసిపోయెను గదయ్య నీ దయాతటిని
సీలమడంలలోతు లేదు దడిపొడి చేయదు సామి
శూలమ్ము చివర శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 79

తుదిదాఁకఁ దోడవు వాని వోలికఁ దూగి వచ్చితివి
పదిబారలేగిన యంతలోఁ జప్పఁబడిపోయి తభవ
ముదిసిన నాకంటెఁగూడ మిక్కిలి ముదిసినయట్లు
చొదుగుమాలితివి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 80

నీవు నా మనసులోనుండి యెపుడు కంతేకాల! తొలఁగి
పోవను నొక తృప్తివిడచి నీవల్ల పొందినదేమి
పావనంబైన నీవెల్గు చూపించు పాపానఁబోవు
సూవె యంచనన శ్రీశైలమల్లికార్జున మహాలింగ! 81

రెండుభావాలొకేసారి యుండనిరీతిగాఁ దర్క-
పండితుల్ చెప్పుదురేమి చెప్పుట పరమ మహేశ
గండిలో నొడియు నిచ్చోట, గుండమై కదలవిం దమర
శుండాలమూర్తి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 82

కాలువగా జాలువారి యింతలో గడ్డకట్టెదవు
నాలోన బానుగార్చుచుంటి యగ్గికణంబు నేరుపుగ
కాలాంతకున కైనవాడు నొక్కఁడే కానివాఁడొకటె
సోలింపజేయు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 83

చిత్రము లాగుచున్నయవి యెట్టని చేరువై వ్రేలు
గుత్తులుగుత్తులై ప్రిదిలుకొన్నవి గుండియలెల్ల
బత్తులవో వేల్పుచెట్ట! నీ మెడ పట్టుకొనీవె
సొత్తేమిపోదు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 84

ఓసామి! నీవునా గుండెలోపల నుంటివా! పెద్ద
లా సాము లన్నారటంచు నిది భ్రాంతియా! నాకు నభవ
మాసరమ్ముగ నింతపైకిఁ బొక్కవా! మసలిన నచట
పూసరివాడు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 85

ఒకటి యదార్థమా నంబికాజాని! యుర్వి నెందేని
నెకదొట్టి యుండె నీ తత్త్వ మయ్యది యెంతైనఁగాని
కొకిబికి యీ ధరాతత్త్వముం ద్రవ్వకొలఁదిఁ గన్పడెడు
ఘూకమొండ్లనట్లు శ్రీశైలమల్లికార్జున మహాలింగ! 86

ఎదలోని భాధకు భావనాదీప్తికెల్ల విరామ
మొదవిన యెచ్చోటనో నిరాకార మూని యుందువని
మదినమ్మఁజాల నిఁక భావతీవ్రత మదిలోని నొవ్వు
సొద నీవుతోఁప శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 87

ఇది కాదటంచు నా బ్రతుకు నేను యథేచ్ఛంబుగాఁగ
బ్రదుకుచు మరి మధ్యమధ్య నీవు కన్పడవంచుఁ దెనుఁగు
పదములు వ్రాయుచు నాటకంబుగా భావింతువే మొ
సుదతీ కృతార్థ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 88

నానమ్మక మిమ్మది స్వామినాథ! నాదు జన్మాలచేతఁ
బూని తా నియమితమయ్యె వాసుకిభోగి కేయూర!
దీనిచేనిన్ను భావింతు నైరమ్మదీయమహా సరసి
సోనవుగాఁగ శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 89

నీలలోహిత! ప్రొద్దుక్రుంకినంతనే నీవా వెనుకను
వ్రాలి వత్తువని మొరుంగుదున యమ్మవారి వానగలు
వ్రాలు చందురురేయి శుక్రగురువులు బావిలీల్ పాప
సూలచేకట్లు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! విశ్వే:

ఒనరైన యంతలో నా మన స్ఫూరియూరియున్నయది
వనితాధనోహ శే యుప్పుకారమానయు నూనె యనగ
తనర బండను వేసిరాచినంబోదు దానిలక్షణము
సాన తావిచెడదు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 91

పిచ్చి తాఁగుదిరినఁగాని యోస్వామి పెండిలికాదు
పిచ్చి తాఁగుదురదు ప్రాణనాయక! పెండ్లైనఁగాని
హెచ్చి నిన్నూహింతు మనసుచేతనే యిది చావ దీవు
చొచ్చినఁగాని శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 92

చెట్ట యీ మనసున కయ్యో సిగ్గువచ్చియు సిగ్గురాదు
పట్టినచోటనే పాముకరచియుఁ బట్టు నచ్చోచె
చుట్ట పెట్టిహరింపు దీనిని మరుగు జొచ్చితి నాత్మ
చుట్టమవంచు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 93

ప్రళయంబు లెన్నైనఁ గడచుదాకఁ మార్కండేయునట్లు
ఇలమీఁద నుంచుమంచంటినా జన్మలింకేమి నాకు
వలదంటినా నాదుతలపులో నీవు వచ్చి నిల్మంటి
చులుక చేసితినా శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 94

అనుభవ స్మృతిగాక పెద్ద సుఖము లే దనుభవవేళ
ననుభవ వేళయందు సుఖమన్నచో నదియు భావనయ
పనితభావన కింత హేయ మల్పమగా పరికరమేలొ
చొనిపినావీవు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 95

నమ్మితి నుపనిషదర్థముల్ నిన్ను నమ్మితి నిన్ను
నిమ్మయి నమ్మనో నీవుచేసెడి దేమియులేదు
నమ్మినప్పుడు చేయవలదురయ్యా యీ నాకు నిమ్మనవె
సొమ్ములు నీవి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 96

ఏవేళ నినుఁజూచినానో యావేళ నీ గుండెకాయ
కావువేసితి రంగుమారె వృంతమ్మకడఁ జుక్కపొడిచె
సేవింపఁగా నీవు నెంచవేలో పచ్చి మరిందు కలిమి
సూవె మిక్కిలిగ శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 97

ఒకవేళ నేనెఱుంగకయ సేవించుచుంటివేమో య
యకదంబ! సేవించనట్లుగ నభినయంబు సేయుచును
ముకుపుటంబునఁ బెట్టి యాఘ్రాణమ్ముం జేయు దేమొ
సుకుమారమూర్తి! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 98

నీ వంతరాత్మలో నిలచి వెలికిని నిగుడుయత్నంబు
దేవి శారదగ భాసించె నాదేవి దేవ! భవత్కృ
పావృష్టిఁ దగు నాదు జిహ్వాతుదఁ బైకిఁ బ్రాఁకిన నచట
సూవె నీయున్కి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 99

పరగ నా శారదాదేవి నీనుండి బయలుదేరినది
సరసిజభవురాణి యొక్కధార నాసన్నిధిఁ బ్రాఁకె
హర! నన్ను నా ధార వెంట నీవద్ద కరుదేరనీవె
సురనదీచూడ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 100

శ్రీ నీరధి నిషంగ, భక్తజనతతి శ్రేయోఽనుషంగ!
మానాథశరసంగ, ప్రౌఢ వృషభ రాణ్మద్యత్తురంగ!
ఘ్మానూతన శశాంగ! సంగతోత్క్షిప్త సౌరాంబుభంగ!
శూలాభిషంగ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 101



# విశ్వనాథ మధ్యాక్కఱలు

## శ్రీ కాళహస్తి శతకము

ఆజానుబాహువా! అప్రధృష్య! హృదంత రాపూర్ణ
రాజిత భక్తి వశంవదా! సుశరస్థానకృతర
మాజాని! స్వర్ణముఖీతటీగేహ! మాంజిష్ఠవర్ణ!
రాజిలభూష! శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! 1

తొలినాడు కలకండ పలుకులంబోని, ధూర్జటి సుకవి
పలుకులంబోని దాహమ్ము, చూచెడు వరకాగరాని
యలసనై నిను వచ్చి చూచి యప్పటి కారియు మరల
నలసట యగుచు శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! 2

తిరుపతికింబోయి యొడలి నగలెల్లఁదీసి యిచ్చెదరు
హర! వచ్చి నినుజూచి యొక నమస్కార మాచరించెదరు
వెరపించుటకు మరపించుటకు గలభేదమిద్ది హర
హర మహాదేవ! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 3

దయగల్గెనేని బంగారముం జేతు తాఁకినయంత
దయలేదయేని భస్మీకరింతు తాకినయంత
అయయొ నినుంజూచి భయపడవలెనా! ఆచుకోవలెన
ప్రియత ధీనిలయ! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 4

ఇంతగా నయథార్థ మంచుఁదెలిసియు నీ లోకమందు
నంతలో రమియించుట పరిహరణీయమను సాకుగాని
తంతన్యమాన మోహంపు రేకు దొంతర లెంతయైన
నంతమ్మ కావు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 5

ఏ నెట్లునుంగాను, పరమ హంసయు నింద్రియ విహృతి
లోనడంచి విముక్తినందె, మిగిలిన లోకమేమయ్యెఁ
దానచ్చమా బ్రహ్మమయ్యె బ్రహ్మచైతన్యమే మరల
నైనది జగము, శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ ! 6

ఆయన, యహిరాజు శయ్య నిద్రించె, నా యహిరాజె
నీయెడ భూషణంబయ్యెఁ, గొడుకయ్యె నీ వాని యొకటి
వైయున్న తత్త్వంబా,మీరలిద్దఱా! యధికమా యేదొ
వైయున్కి తోఁచు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 7

ఎంతకు విడలని యంతగట్టిది యింతలో విడిలు
అంత పీట ముడిపడ్డదియు నూరకే యా మర్మమరయు
నంతయు మరి వడ్లగింజలోని బియ్యపు గింజ యెంతో
ప్రాంతమైయొప్పు శ్రీకాళహస్తీశ్వరా!మహాదేవ! 8

అన్నివిద్యలకును దుట్టతుద తెలియని దంచుఁ గలదు
తిన్నగా మనుజుని యూహకందనిది రహస్యమాచుఁ
నిన్నుఁ దోపించెడి దద్దివదలి మానిసులాడెదరు, బ్ర
హన్నలా సమితి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 9

పొత్తపి నాటి దైవంబ! మై మైలపోగుల చేదలు,
చెత్త రాళ్ళులు చేర్చునేన్గు పాములు చెప్పొత్తు బోయ
చిత్తమ్మునకు వచ్చి మల్లెపూఁ దేనె చిన్కులకైత
హత్తదా నీకు శ్రీ కాళహస్తీశ్వరా!మహాదేవ! 10

కడుపులో నాదిత్యు లగ్నులును రుద్రఘటలైన నీవు
మెడఁగాల కూటమ్ము తాల్చినట్టిది మేటి మాటయకొ
యుడుకు నగ్నుల బోనఁ బిడుగుపడెనన్న దొక వార్తగాగ
నడిగినయట్లు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 11

నా మీద దయమాలి తేల ? బలిసెనో నా యొడల్ సామి
నా మనస్సుననుండి యెందుకని వెళ్ళినావయ్య నీవు
పో మనస్సిది దొంగపడి దోచుకపోయినట్లుండెఁ
బ్రామిన్కుదినుస! శ్రీ కాళహస్తీశ్వరా!మహాదేవ! 12

గుమికూడి,లోక వైయర్థ్య భావన గుబులుగా వచ్చి
యమృతాంశు నవకళలాకాచమత్కిరీటా! నీవు తోచి
విమలిత తత్త్వాల సాధు మృదుచిత్త వీధిలో మెల్ల
భ్రమియించుచుంటి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 13

మారేడు దళములు భూతిపూతయు మంచిగంధంబు
నౌర? నీ యభిషేకమైన పిమ్మట నధిక సౌందర్య
మారుచి నీ లింగమునకు నిర్వాణమయ్యెఁ గన్నులకు
హారాయితాహి! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 14

లాలసలేకుండఁ జూచినన్ నీ విలాసంబుగాఁగ
నీ లోకమంతయు నీవుగాఁదోఁచు, నెనఁ గోర్కె క్రమ్మ
నీలోకమందు నీ పొడయె కన్పించదేమి చిత్రమ్మ
ప్రాలేయ కరుణ ! శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 15

హర! నన్ను నే నీకు సర్వ మర్పించినప్పటినుండి
బరువు దించినయట్టులుండెఁ దేలికపడితి నుమేశ !
బరువు నాయది నీకు నెత్తిన పాపమ్ము కలదొ
యరయంగనేర శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 16

ఎప్పుడెదో దిగులెప్పుడేవో సహింపగా రాని
విప్పుకోఁజాలని చిక్కులను దెచ్చి పెట్టెదవేని
అప్పుడు నినుఁగూర్చి తలతునో కాని, అన్నియునున్న
యప్పుడుకాదు శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 17

నీ కన్న పాదరసమ్ము నయము దొన్నియ భద్రపరచి
పోకుండనీవచ్చు బియ్యమందుఁ గప్పురమును నారి
పోకుండ నిల్పగావచ్చు మదినుండి పోకుండ నిన్ను
నాఁ కిడరాదు శ్రీకాళహస్తీశ్వరా ! మహాదేవ! 18

ఖడ్గ ధారావ్రతమయ్యో నీతోడ గదల నీవింత
అడ్డువేయఁగ నీవు తీయఁగానీవు అహిరాజభూష
మడ్డున ముగ్గినవానిఁ బైనుండి మస్తకం బదిమి
యడ్డునంటింతు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 19

నిన్ను విస్మృతి పొందినట్లుగాఁగ నొన్నాళ్లేమియౌనో
సన్నగా వచ్చుట తెలియు గుండెలో సవరించుచుండి
కున్నలై తెలియక యుండ నడుగంట నోకుక చనెడు
ప్రసన్నసమాలి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 20

అరసి నానాక్షేత్ర సమితి యందు మీరావిర్భవించి
భరత దేశంబున భక్తి భావంబు పన కల్పించుకొంచు
పొరుగు రక్కసి యూబిలోన దిగఁబడిపోకుండ జనుల
నరసికొంచుండ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 21

మీరమ్య మూర్తులనుండి యగ్నుల మిలమిలల్ బయలు
దేరి యదృశ్యముల్ మిన్నునందున దెసలందు నిండి
ధారుణీ భాగంబునందు యోగ్యమా స్థలముల వెలుగు
లాచరించుచుండ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 22

ఉండియుండి యెదో ప్రసన్నత యదెందుకో నాకుఁ దెలియ
దండపాయని గుర్తో యేమొ యొక మోహనాకార రేఖ
గండరించెదు, వచ్చి కన్బొమలమధ్య కనుచూపుమేర
హుండి దించితన శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 23

అచ్చట మీ మీ సుసన్నిధానంబులందుఁ గొన్నాళ్ళు
వచ్చి సేవింపగాఁ బట్టరానంత భావంబు కలదు
విచ్చి రాసీని యీ కొలికిపూస తప్పింపు మూడిపడి
యచ్చటనుంటి శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 24

ఏది యిచ్చిననైనగాని తలగీసి యిచ్చెదు కొఱత
యాది, న తృప్తి హేతువయి మోహముగ్నాత్మను బెగుల
సీద, యిద్దాన నయ్యోడిది లేదు పోయెడిది లేదైన
నాది మోహమ్ము శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 25

అకట ! యుదుము పట్టు పట్టుకొన్నదయ్యా మహాదేవ !
చికిలి చేయుచునుంటి మాటిమాటికి సీత్కరించుచున్న
మకిలి పట్టుచువచ్చు నొక్కదెసనుండి మరి నాటుకుక్క
ప్రకటమై దినుసు శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 26

నిను రెండు కన్బొమల్ నడుమ యత్నించి నిలుపుట యొకటి
నినుఁగూర్చి లోఁతైన యూహ తెచ్చుకొని రసించుటొకటి
నను దెచ్చి నీలోన గలిపికోఁజేసిన ప్రయత్నములకు
ననుకూలపడవె శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ! 27

ఈవిట్టివాఁడ వంచింతయును నిర్ణయించుకోలేక
భావంబునం దెట్టి యూహ పొడము నీ పరమస్వరూప
మావిష్కరింపించుకొనగ నా వెంట యతనంబు సేతు
రా ! వత్తొ ! రావొ శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 28

మంటిలో గాలిలో నీటిలో నిప్పుమంటలో బయలి
మింటిలో నా గుండెలోన నేదేది మేలైన పొడయొ
నంటియుండెదు దానినంచు నినుదాన నావిష్కరింతు
నంటిరా ! స్వామి ! శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 29

కంట వత్తిడుకొని పవలు రాత్రులు కాపలా కాచి
పంటకొగ్గుట యెప్పుడో తెలియని యప్ప ! పరాకువేళ
కంటిముందాడి యందికొన యత్నించకయుమున్ పొకాలు
మంటెన్నిసార్లు శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 30

ఓమెద వని యొక్క మూర్తి ధ్యానించి యొరిగించుకొన్న
దేమి వార్విశ్వమంతయును నీవంచు నెంచిన నాకు
సోమించ నిదియేమి ప్రతిపదానంద సోమకిరీట
రై మాటకేమి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 31

ఎందాక మనసులో నుందువో శాంతి యదియు నందాక
ఎందాక నుందువు లిప్తయుండది యేడాది యనగ
సందీపితంబగు నంతబరువైన సరకీవు హృదయ
మాందోళితముగ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 32

మాటిమాటికి బలవంతముగ నిన్ను మదిలోన నిలుప
పాటించి యెప్పుడు నెడదనొకవంక వచ్చియుండదెవు
నాటియున్నది నాకు నిత్య సన్నిధానంబు గల్గినది
హాటకవర్ణ! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 33

వానికిఁ జలిలేద యెండలేద యప్పటికిని దొరకె
నేనియుఁదినఁ లేద యేనిఁ దినడు తా నిటునటు కదలు
టైనలేదే మన్నుతిన్న పాము దేహంబున్న నట్టు
లైనను సుఖము శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 34

ఎంతెంత యల్పమ్ము లిచట మర్యాదలీ గౌరవములు
వింతలౌ నుద్యోగములును హర! వీని వెంబడిఁబడిఁ, హృ
దంతరాళము గండ్లుపడిన ఢవి పూడ్చుటన్నది కలదె
యంత కాంతకుడ! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 35

వదలిపోయినఁ దిండి సాగుబెట్లించు వనవేదువాడు
వదలిపోవుట సంభవించునా వానివల్ల కాదద్ది
ఎదను క్రిందంబడి మీఁదఁబడి యిట్లె యీదుచునుండు
నదమిత విషయ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 36

చచ్చెడునాటికి సంధ్య మంత్రమున్ జదుకు పల్కొప్ప
హెచ్చి యుర్వదియేండ్లు దాటినప్పు డిదేదోను నాకుఁ
దెచ్చిపెట్టితి విల్లు వదలిపెట్టి నీ దెసకు రాకుండ
రచ్చకెక్కించి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 37

నీ నేర్పుకొలదిగా నన్ను మేకు బందీచేయు మిచట
నా నేర్పుకొలదిగా నీదు సన్నిధానము చొత్తు నచట
వానీరమది బిట్టు వరదలై యెంతొ ప్రాలి నీరోవు
లై నిల్చుఁగాదె శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 38

చేకొని నా గుండెలోన వచ్చి వసించుచునుంటి
లౌకికంబుగ నింతలోన నాకొక్క లాభంబుగలిగె
నాకుఁ దెలియకుండ దూసికొని పోయినావు జగత్ప్ర
భాకార దూర ! శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 39

ఇదికాదు లేవయ్య యెప్పటికి నేది యెట్లైనఁగాని
మనసులోన నొకమూల నక్కియుండెడు మాత్రముగాక
కదలుచుండను వలె బ్రదుకు లోతులు కదిలించవలయు
నది మానఁబోకు శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 40

ఏడాది మరియును గాదయేని రెండేండ్లు నీ తీర్థ
మాడవచ్చెద నిమేషమును దొలగిపోనై నది లేక
తోడుమాని నడిమి కాలమున విడఁద్రొక్కకు నన్ను
నాడిపోసెదరు శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 41

ఈ కోప మీ యహంకార మీ కామ మివియెల్ల స్వామి
నీ కృప కలుగక వెన్కకుంబయనించు నట్లుగను
లేకున్నవయ్య ! యుమర్బుధవిలోక ! లేలిహానాంగ
దా ! కాలకంఠ ! శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 42

బహుళముల్ దుష్టభావములు మృత్యువు భయము నీమూటి
విహరణ వైఖరి లోకపతి ! యొక్క విధముననుండు
నహహా యీ మూడింటఁగగన దురూహలే యధిక భీకరము
లహరహమ్మభవ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 43

మేలుకొన్నప్పటికంటె కలలోన మెదిలిన భయము
తూలి విచారణచేసి హేతువు తొలగింపరాక
వ్రాలి గుండియఁగలగుండు వెట్టు నీ భయమెందు కేమి ?
యా లేనివేళ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 44

నాలోన నింకొక్క యర, మహేశ! యంతర్నాటకంబు
వోలె, నిచ్చటి దుఃఖచయము చాలనిపోల్కి స్వప్నమ్మ
గాలిలో వట్టిన దుఃఖపడు మన్నగతి నవివేక
మాలంబనముగ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 45

అచట భయంపడు నాతఁడల జీవుఁడా భయమునకు
నిచటి యీ దేహ మాలంబ మీ దేహమేగిన పిదప
నెచటి యాలంబమో యకట తానెయా యిదియునునదియు
ప్రచుర నిష్కరుణ! శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 46

ఆలంబనము లేక కూడనున్న భయంబిది నిత్య
మాలంబనమునకు వెదకు నది హేతువయ్యె జన్మలకు
ఆలంబనమ్ముల కేమి ? మూలభయంబు నీ కరుణ
నాలూనమైన శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 47

ఒగిలి_త్తలు గుణించుకొని మహాకాలమొకటి యేర్పడియె
నొగి బిందులు గుణించుకొని మహాదేశమొకటి యేర్పడియె
తగలి_త్తయే బిందువా ప్రథమమైన తళుకైన నిన్ను
నగుపించుకొనవె శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 48

అనుభవ పరమార్థభూతులైన మహాత్ములమాట
ల నొకంటనైన నాయెడల ననుభూతి లాభంబురాద
తనరంగనా యనుభూతి దవ్వనఁ దారాడునట్లు
ననిపించరాదె శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 49

ఒకసాలెపురుగు నింకొక్క యేనుగు నొక పాము వీని
నకట ! త్రేతాయుగస్వామివైన గాకాచికొఁగలవె
వికృతమై కాలంబు మేము నిన్ను సేవింపగాఁజాల
దకట మా నిష్ఠ శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 50

సంచిత ప్రారబ్ధములను మరి గ్రహచారంబు వీని
పంచిన జన్మంబు నడకయిది మేకు బందీ మనుగడ
కొంచెమో అదికూడలేదో నేను వెల్గునని, హరింపు
మంచింత యిరులు శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 51

ఏపూర్వ పుణ్యమో మనసు నిను స్మరియించుచునుండె
ఆపూర్వ పుణ్యమ్ము నిన్ను నాకుఁ బ్రత్యక్షమ్ము సేయ
నోపినయంత యున్నదియొ లేదో మహాబ్ధి ! నీ కరుణ
ఆ పాళమేమొ శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 52

మనసు లోఁతుననుండి చేయు భావన మన్నించుచుంటి
పనితమై జిహ్వ నిన్నెపుడు పలికినఁ బాటింపవింత
మనసు వెన్కనులేనిమాట దారుసంరావమో తాక
దనుకొందు నిన్ను శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 53

ఇది త్రిశంకుస్వర్గమయ్యె నా బ్రదు కిట్టట్టుగాక
మదికి నట్టిట్లయి జ్యోతిరాదికమార్గమ్మునఁ జెషి
పదివేల్ త్రిశంకులుండిరన నా కేమిపట్టె నీ దెసకు
నదుముకోవయ్య శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 54

ఎంతగా విసువెత్తుచున్నదన, సాగనీ సాగనిమ్మ
అంతమ్మదెట్లును గలద, పైననేమగు నద్ది యగున
చింతాకు కృపయు మాస్వామి నాపైనఁ జిలికించడన్న
యంతగా నాకు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 55

నా పూర్వకర్మంబు నిన్ను బ్రతికినన్నాళ్లు చింతించి
వాపోవుచుండి యదెపుడో దేహంబు వదలుటో యేమొ
ఆపుర్వ మాత్రము కాని మనుగడయయి తుదిదాక
రాపు పొందుచును శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 65

ఎక్కువభాగమెడారి యటనట నెక్కడెక్కడనో
యొక్కటియో రెండో పచ్చని స్థలాలు యూర్పు తీసికొన
నక్కటా! చేసితి నాదు పయనంబు నచ్చోట, లేని
యక్కటికమున శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 57

ఇది పాపమంచును దెలియు, మనసులో నెక్కడో బెసకు
నదుపు, పట్టికొనంగ, ననువుచాలక, యటునిటు విరియు
నది నీ కృపావిశేషమున నేదియో యడ్డుకోవలయు
నదనునయందు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 58

అజపజ తెలియనియట్టి స్థితిలోన నమరె నాలెక్క
విజితారి ! యిదినిల్వ యిది ఋణంబన్న విధమెరుంగకయ
పజలోనఁబడితి గ్రుడ్డెద్దు చేనిలోబడ్డ విధాన
నజగవధారి ! శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 59

చదిసిన గుండియై క్రోధలోభ మాత్సర్యముల్ కొంత
యదుపులోఁ బెట్టితిఁగాని తలమీరినట్టి మోహంబు
వెదఁగాడి క్రిందికిరాదు దమియింపవే దీని, శమన
రద పాద దమన ! శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 60

నన్నింత వ్యష్టిగాఁబెడకు ద్రొక్కి గంతలుకట్టి కనుల
మన్నుతిన్పించెదు పచ్చికన్నట్టి మమత కల్పించి
నిన్ను నమ్మినదాని కిట్లు జేయనేవలెఁ బ్రభుత
యన్న దెట్లుండు శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 61

ఇల్లువదలిపోవ వేయి యూహాలిల్లెసగ వన్నెకన్న
నల్లగాంతారంబు నందు లతలు వేలవి యల్లుకొనగ
నల్లుకోనైన గుణంబు నిర్మూలమగుఁగాక సాంధ్య
హల్లీసకాంత ! శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 62

వెనసర్వ సృష్టిహేతువయి తగునెల్ల విక్షేపశక్తి
ముసరి నా మనసులో వచ్చి కూర్చుండెఁ బులిపీట వెట్టి
ప్రసరత్సమష్టి జీవ నిచయాధార రమ్య మహస్క !
రసిఘియింపు మిచట శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 63

అన్నాను నీభక్తుడ ననిపైకి, నీ యడుగుల నందు
కొన్నానో, అదిలేదు, గ్రుడ్డిగుడ్డాలకుం బండ్లుతోము
చున్నాను యమ నియమములు ధ్యానంబు నొకయింతలేవ
యన్నఖాది నయి శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 64

ఇష్టమైనట్లు కానట్లు నిదురలో నెప్పుడో వచ్చి
యిష్టమ్ము ననుభవించి పోదు పగలెల్ల నెడపెడ మొగము
నష్ట సంసారమ్ముకాద మరియు నొననుటకు లేద
యష్టమూర్తివయి శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 65

చీలికై యొకసారి వచ్చి క్రమ్మరించి చను మబ్బైన
పీలుకల్లు, కిచాటులేదు చుట్టు వ్యాపించి కూర్చుండె
గాలిబిగించెఁ బట్టుమని కురియదు క్రమ్మి బాధించు
నాలోకనంబు శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 66

కన గురూపసదము చేయుటకుమున్ను కావలసినవి
గానములు తొలుదొల్త నెడదలోపల కుదురుకోలేదు
నినుగూర్చి తెలియగా నెవరి నడుగగానేర నయ్యెదన
యనువు మాలితిని శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 67

కొన్ని జన్మములు దాటితిని, మనోమయ కోశంబునందు
నున్న జన్మమిది, యింకెన్ని జన్మలకో మరి రెండు
మున్నున్న కోశముల్ దాటి నీవైన మూర్తితో నొక్క
డన్నది యగుట శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 68

తెలివియే కొంచెమో కలిగిన కొలందిఁ దెలియమి యొక్క
పగులులోతులు ఘాతములుగఁ దెలియంగఁ బడియెడు
స్వామి!
తలుగు లోతుల నీదు చెమ్మ యొకయింత తగులునో యంచు
నలరెడు నాస శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 69

ఒకయొక్క పొరఁగాగఁ దొందరించక యొలువంగవలయు
నకట యివ్వి తడిసి, నాని, తెగయెండి, యట్టగట్టినవి
తుకతుకలై నీ కృపగిరి ఝురమయి తుడిచిపెట్టకయ
ప్రకటార్థ్యమేది శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 70

ఇద్ది వైరాగ్యమో, మొండితనమొ, నా కెఱుగంగరాద
ఉద్దిగానుండు నీ రెండు, వైరాగ్యమొక చిత్రమైన
దద్ది యుండిన దూరదూరములను నీ వగుపించుచుండు
వద్ది యున్నదటె శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 71

ఇదికూడ వైరాగ్య మార్గమే యందు నేది వ్రాసినదో
అది వచ్చు రానిచో రాదు పోనిమ్మటన్న భావమ్ము
మదిని వచ్చుచు నున్కిఁ దృప్తి యిదియంచు మరల
సంశయము
నది యౌనో కాదో శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 72

తనుదాన కిరరించుకొనును మానిసి తనయందులేని
గొనములు తనయందుఁ గలవటంచు నన్కొంచు నేరైనఁ
దనయందు నవి లేవటన్నఁ దెలియున తనలోని పశుత
హానువుపై నాడు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 73

పుట్టినదానికి సర్వ పరమార్థభూతమై యున్కి
మెట్టిన మీ క్షేత్రభూమి, బ్రదుకెల్ల మీరుగా నగుట
మిట్టిపడుదు నద్దినేర్చి యిద్దినేర్చి మృడ! యవివేక
మట్టకట్టితిని శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 74

అయ్యవార్లంగారినిఁ బొనరింపఁబో నది కోఁతియయ్యె
నయ్యయో నీ దెస నన్నుఁ ద్రిప్పికో నాపద తెచ్చి
కయ్య కోసితి గుండె నీదు దెస భక్తికాక దుఃఖాన
వ్రయ్యలై పోదు శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 75

పాము పడగవిప్పి శిరసుపై నీడపట్టిన నేది
యేమేలు కలుగునందురు సదా నీ కహి మహేంద్రుఁడుండు
నామాదిరింగనె మేలు నీకు నిత్యంబు మాదృశుల
వౌమాటలేమొ శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 76

పాము ప్రాఁతయుగంబు దానిఁ దనువులోపలఁ జేర్చికొంటి
నోమితి దురితంబు, మల్లికార్జునుండును బసవన్న
సోమన యన్నమయ్యయును నేను నీ స్తుతి పతంజలుల
మై మేముకామొ శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 77

చేసిన పాపంబు హర ! సదాశివ ! చెప్పినబోవు
మోసంబుచేసితి మెల్లనన్ను గుంపునఁదూర్చి చెప్పి
ఆసత్త్వ మూర్తులు పరమ శైవులే నద్వైతి నిన్ను
నాసింతు నంతే శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 78

బంగరు రేకులు విప్పినట్లుగా వరలెడు నీదు
లింగంబు కన్నులు మూసినంతగ లీలగా నొసట
ముంగిట కట్టులు తీయఁబోయిన మ్రుగ్గొల్కినట్లు
అంగజాతారి! శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! 79

ఎంత పొడుచుక చూచినను గన్నుల కగుపడబోవు
ఎంతగాఁ జొచ్చిచూచినను గుండెలో నింత కన్పడవు
అంతగాఁ గంటికిఁ గలికమున కైన నక్కఅపడవు
ప్రాంతమై యుండి శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! 80

ఎందుచేత మనస్సుఁ గామపుంద్రోవ కెడముగా లాగు
మందురు, మరియును జనన మరణంబులకు నందుచేతఁ
బొందు కామమ్మున యందు న్యాయపుంబొంత పోలేర
యందుచేఁగూడ, శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! 81

బ్రదుకెల్ల నీరీతిగాగ నీమీఁదఁ బాటలు పాడఁ
జదురుగాఁ దుదకిదియెల్ల గవితగా జమకట్టెదేమొ
యిది ముందరే తేల్చి పెట్టు మూరక యీ శ్రమయేల
అది యౌనొకాదో! శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! 82

అనవధియగు నిదో సాగరమున గోళాకార మొప్పా
చును తేలుచున్నట్లుగాఁ గానిపించును నీదు లింగ
ము, నయనములు మూసికొనగనా ప్రాణమూర్తిహర్తార్తి!
యనల దృగ్భావ! శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! 83

పొనువడ్డ నీ కంటి యగ్నిగోళమై పొలుచు నీలింగ
మనిపించుఁ దక్కిన తనువు పంచభూతాత్మకంబగుచుఁ
గనిపించు నెల్లెడ నో యుషర్బుధాకార! యనగ్ని
వనిలేదు నేను శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 84

అదియేదో మెఱపుగా నగుచు నీ చుట్టు ననిపించు నాకు
పదిలమై నీదు లింగమ్ము ధ్యానించు పట్టున స్వామి!
యది యొక్క తెల్వి బాంగరముగానాడు నన్నట్లు నొక్క
హ్రాదసుధా భ్రమిగ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ 85

నాజాతకంబును బట్టి యిదిదని నాకును దెలియు
నాజన్మలో నీవు కానిపించవన్నది కూడఁ దెలియు
రోజురోజును వ్యర్థముగనె నే నిన్ను రోయుదు నీవు
నాజి చేసెదవు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 86

రోజురోజుకు దుర్ఘటం బవుచునుండెఁ బ్రొద్దుగ్రుంకుటయు
నీ జపంబొక్కటై ప్రాణ నిచయంబు నిల్పుచున్నదియు
నాజవం జవముపై నూటికిన్నాఱనగు పాళ్ళు లేదు
రాజసబుద్ధి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 87

పదివాగులై పాఱు కాలకర్మముల్ పాపపుణ్యములు
బ్రదుకు చావులు వెల్గుచీకఁటులు దైవపౌరుషంబులును
కదలికచే నొక్కఁడొక్కఁడు కలియుట కలుగుఁ గదలుట
యది మానిపింపు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 88

బియ్యమ్ములో రాళ్ళు తేరనగుగాని వెసరాళ్ళలోన
బియ్యమేరి ప్రయోజనంబు సుంత కన్పించదు స్వామి!
యయ్యయో పాపపు టూహాలందు బుణ్యపుటూహ లేరు
టమ్యో నా బ్రదుకు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 89

మెఱవద యుఱుమద తెఱపిలేకొక్క మెయి వానవిడక
కురిసెడు ప్రాయి క్రిందఁబైన మిక్కిలి కొఱఁతయైన యది
వెరవేది యున్నది నా స్వామి! యీ వాన వెలియింపు నిన్ను
నరుదెంతుఁ జూడ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 90

మొదలు తుదల్ లేని కాలముల దేశముల జనుల్ పుట్టి
బ్రదుకుచుఁ చుచ్చు జహింసచేయుచుఁ జంపుచుఁగనుచు
నదులు పొంగుచు భూమి పగిలి యుద్ధముల్ నడుపుచు నేమి
యదుపు లేదాయె శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 91

నేనెట్లు ముక్తి పొందుదును నాకెట్లు నీవు కన్పడెదు
ఈ నేర్పు వెదకుటకాదు నీవ యీ సృష్టికి హేతు
వైనది జగమెల్ల నెందు కొప్పికోదని కోప మేమి
యైనది ముక్తి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 92

ఎప్పుడు వత్తువో యెపుడు పోదువో యెఱుగక నీవు
చెప్పక వచ్చితో యని పరామర్శ చేసి చూచెదను
చప్పని గుండియ తెలిసి లోకమ్ము చాయఁబోయెదన
యప్పటికైన శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ ! 93

నీ వేగుదెంచి లో నాడుటకు వెంటనే గుర్తు నిత్య
జీవనంబగు నుప్పుతేలు పోటొగ్గి జీర్వారు, భువన
భావనా కల్మష క్షాళనముచేసి పాలైనవేళ
నావి తేరెదన శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ ! 94

కునికి యంగటిలోని బెల్లమునకును గుడిలోని లింగ
మునకు నైవేద్య మన్నట్లు జీవితమును బెసకింప
మనసు నీపై నున్న యట్లభినయింతు మరి వీలుకాద
యనుటకు లేద శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 95

లింగంబవీవ, పరస్వరూప మాలింగసంబంధి
లింగమన్మాట యన్వర్థతంగను లీల నీయందె
లింగమ్మె కాని మూర్తులను గొలుతు రలీక లింగముల
సంగజాతారి! శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 96

సృష్టికి హేతువు నీవ యర్ధనారీశ్వరమూర్తి
సృష్టి ఘటిల్లు స్త్రీ పుంస యోగంబు చేతనకాదె
స్పష్టమైయున్న నీ మూర్తిని నెఱుంగఁజాలమిఁ బెట్ట
వష్ట సంపత్కి శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 97

వెసనావు పాల్వోని నాదుకైత నైవేద్య మిచ్చెదన
రసఁగప్పురము వోని నా శరీర మారాత్రిక నిత్తు
కసటు నా యీ బ్రదుకగురుధూపంబుగా నిత్తుస్వామి
హాసియింపు మిచట శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 98

కాళ్ళను బడ్డ పా మెట్టు లైనను గరవక పోదు
గూళ్ళయ్యె నా మేను పాముల కటంచుఁ గూర్చుండఁబోకు
సుళ్లైన నామనిక్కఁ జేయఁబోకువె సున్నకు సున్న
వాళ్ళికి వాళ్ళి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 99

పంతమేమిటికిఁ గించిత్కరుని తోడఁ బనికిమాలిన య
లంతితోడ యమాదులలవడవు లోబలంబుగా నిన్నుఁ
జింతించుచున్నప్డు హంసలేవఁ దీసికొని పో! యాత్మ
ప్రాంతమై యుండి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 100

ఆజానుబాహువా! అప్రధృష్య! హృదంత రాపూర్ణ
రాజిత భక్తి వశంవదా! సుశరస్థాన కృత ర
మాజాని! స్వర్ణముఖీతటీగేహా! మాంజిష్ఠవర్ణ
రాజిల భూష! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 101

—

—

# విశ్వనాథ మధ్యాక్కఱలు
# భద్రగిరి శతకము

శ్రీరామచంద్ర ! యస్మద్ధృదురు వియత్ ప్రియతమ చంద్ర!
సారోపనిషదర్థభూత ! ముక్తి యోషామణీ క్రీత !
నీరధి భంగ ! భూమీసుతా మనో నీరజభృంగ !
నీరధరశ్యామ ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 1

మఱియొక్క యూహ తోచెడిని నాదు నీమాత్రమా పద్య
విరచనకే పొంగిపోయి శ్రీముక్తి విభవంబు నాకు
నొరిగింపనైన నొడళ్ళు వరుగులై యుగములు తపము
నెఱయించుటేలొకో భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 2

ఎవ్వరో యెవ్వరో యయిన యీాదైన్య మెసఁగు కోరికలు
రువ్వాటలో నర్థమొప్ప విశ్వేశ్వరుండును నీవు
నవ్వల మీాయంత మీారు చేదుకో నవువారు నన్ను
నెవ్వగల్ కూర్పక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 3

మనసెక్కవగ నైహికమ్మగు దినుసు మనసుతో మమ్మ
మననంబుచేసిన నైహికమ్ములా మహిమల నిత్తు
మనుకొన్న నది యేల యాత్మలో వచ్చి యవధరింపఁగల
నెనరె చూపింపుడు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 4

లావణ్యనిధి ! లక్షమంది రావణులం జంపుమీావు
భావంబులో నిన్ను నెంచఁ జివురాకు పగిది భాసింతు
జీవంబులో నెంత మార్దవమ్మను జెండించఁగలవో
నీవారశూకాభ ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 5

గ్రహములు తొమ్మిదిమంది యైదు వర్ణమ్ములవారు
గ్రహముల సంచారగతిని నేను కిరాతబుద్ధి నయి
విహరింపవచ్చు నొక్కపుడు చైతన్య విభవాంబురాశి
స్పృహార్హ ! పాలింపవే భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ౬

అన్ని రోగంబులు కుదిరినవి గాని యీ రోగమొకడు
చిన్నమెత్తంతైనఁ గుదురలేదు రాజీవాక్ష ! రామ !
యన్నలా ! లగ్నమందున్న కుజుడును నసురగురుండు
నిన్నుఁ గాదన్నట్లు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 7

మొగిఁ బాపముల నీదు మైవెలుఁగు మహోంబులలో మునుఁగుట
కుగ నెంచగా నొడ్డు కచ్చితంబుగా గోసినట్లుండె
దిగుటకు లేదింత దూఁకుటే కాక ధృతి నిల్వ నీవు
నెగడించుటయె కాక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 8

ప్రోవుల నీళ్ళొక్కసారి వట్టుగా ముంచెత్తు నీదు
లావణ్య నది యొక్కసారి జివ్వున లాగివేసెడిని
దేవ ! నీదయ యెప్పుడెట్టులుండునో తెలియగఁజాల
నీవ కన్పడవాయె భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 9

వెసఁదెల్గు తెల్గంచు జనము వెఱ్ఱిగంతులు వేయుచున్న
దెసమూలు మాజాతి కీవొకండవు తెలుఁగుదైవమవు
కసితీర నుతియింతు నిన్నుఁ దెలుగు వక్కణముల తోడ
నిసిపోవఁ బగలురా భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 10

హరుఁడని నీవును, నీవని హరుండు, వ్యర్థపుచ్చకుడు
జరిపి నా ప్రార్థన మీరుమీరు వచ్చుందాలు పోయి
చెరియొక చేయివేసినను జాలును చేరితి ముక్తి
నిరుపమాన దయాబ్ధి! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 11

కొనిపోయి నన్నుఁ గైలాసమందో వైకుంఠంబునందో
గణములలోఁ బారిషదులలోఁ జేర్పఁగాఁ గోరలేదె
ననునేన పాపముల్ తోలఁచ మనసిగ్గికొన సాయపడ
నెనరు చూపుడటంటి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 12

పడిఁబుట్టుచునె యున్నది ప్రజ, బాధలు పడుచునే యున్న
దోడుదుడుకు సుఖానికి జతనమ్ము చేయుచునె యున్నదియు
విడుదలలేదింత మెలికలోనుండి విడుదలలేదు
నిడుద యూర్పుల గమి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 13

తడవకు నెప్పటికపుడె సంసార తాపత్రయంబు
బెడఁదతోనే సరిపోవుచున్నది ప్రియతమ జ్యోతి
నెడఁదకు నిను గదియించుకో నెప్డా యెఱుఁగన యెడఁద
నిడివి యాసఫలింప భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 14

తెలివిగా నెదో చేయఁబోయి తలదూర్చి తీసికోలేక
వెలిమేసుగాలిలోఁ గొట్టుకో నఱపిట్ట నయ్యోదను
కలుగగాఁ గోదండ రమ్యమైన కైదండ యీవె
నిలువఁ ద్రొక్కికొనంగ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 15

కొండపైఁ గోఁతి రమ్మన్న రాదు మాకును, నీవనుకొన
కుండఁ దానై వచ్చు రాక్షసవధ చేయును బయిపెచ్చు
కొండపైఁ గోఁతి రానక్కఱయె లేదు కోఁతియు నీవు
నిండియున్నా రెద, భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 16

విడివడి కట్టలు తెగిన మతిఁ బుల్లవిరుపు మాటలను
చెడిపోవుచున్నారు కొంతమంది నిం జేరఁగాలేక
వడి నాకు నీదయ ముదురు పాకానఁ బడక నిన్ గాద
నెడు బుద్ధి రాలేదు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ ! 17

ఈపద్యములు నీవు నిట్టివేషాల నెందఱో వేతు
రీ పప్పు లుడకవు చచ్చినట్లుగా నింద్రియ జయము
ప్రాపింపఁ జేసికో తేరగా వచ్చి పడదనె దీవు
నీపట్టు తెలియులే భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 18

ఈ వెట్ట యిటులున్న నింక నేమైన నున్నదా మండి
పోవుటయే కాక యింద్రియ జయమ్ము పొలుపేది నాదు
జీవ వల్లరి వాలుతీర, మూరాకు చేరికగాగ
నీవు నిల్వకయున్న భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 19

పదవయ్య నాస్వామి ! విదియనాడు కన్పడని చందురుఁడు
తదియనాడైనఁ గన్పడును గన్పడి దారపుఁ బోగు
పద యిత్తు నీలాపనింద తొలగించు, భక్తి మేల్కాను
విదురరా నీకువే భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 20

నెఱిఁజచ్చునప్పుడు సంధ్యమంత్రమని బ్రదుకు చివరఁ
బరమహా నీ భక్తి సుంతగానైనఁ బట్టుకొన్న యది
కొఱ గ్రుడ్డిలో మెల్ల, వెరా ప్రాణముల్ గుటగుటలాడు
నెరపురాకయ మున్న భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 21

ఎక్కడనొక లిప్తయైన నీభక్తి హీనమై చనునో
యక్కటా యనిదిగుల్ పడెదునాకు నిద్రావధీరణయు
చక్కబ్రదుకు కృషి కనక తప్పనిసరియు నింతకును
నిక్కమీ వొకడవై భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 22

వగ నా శరీరస్థితి యొగఁదీసిన బ్రహ్మహత్యయును
దిగఁదీసినం గవీ హత్యయుఁగ నున్నది సుతపస్సరణ !
యొగి దీనిరక్ష కష్టముగ నున్నది, యున్నదీ చరణ !
నిగమాంత సంవేద్య భద్రగిరి పుణ్యానిలయ శ్రీరామ ! 23

కథనీది సూక్ష్మమతి రమణీయముగ రచించెదఁ గద
కథనాది పాలింపరాదె స్థూలమ్ముగానైన నీవు
ప్రథితమ్ములిచ్చి పుచ్చుకొనుటలు నీకు బట్టవో ముక్తి
నిధికి శ్రీశాలికి భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ ! 24

పుట్టించి పట్టించినావు కారాని పోరాని సంత
రెట్టించి ధట్టించినావు దుఃఖ దారిద్ర్యంబులెల్ల
కట్టించి ముట్టించినావు తీవ్రాగ్ని కాయంబునందు
నిట్టులమాన్మ కృప భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ ! 25

పట్టిన దయ్యమై, క్రిందఁబెట్టిన వానలు, పైనఁ
బెట్టిన యెండలులేని దుశ్శీలు వీని రక్షింతో
త్రుట్టెలుకట్టిన, జ్ఞానదగ్ధ కర్మలని చెప్పుటయు
నెట్టుచున్నది నన్ను భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ ! 26

నోరు మాటాడుచో వెక్కిరింపనౌ నోస లనుములను
జేరిమీఁదించు మిన్నులను జేతిలోఁబెట్టనౌ నిద్ది
తోరమైనట్టి లౌకికము దీనికి దూరమౌ దీవు
నేరనౌ దూరము భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ ! 27

వలెనని యిది చూడ, ననుభవించగా వలెనని యిద్ది
తలఁపులో బాహిరవోయి యీ కట్టె తమ దయ లేక
చలియించుచున్నది చలన సంగతా సాధుచేష్టముగ
నిలువరింపుము దీని భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ ! 28

కనవలెనని శ్రావణాంబుధర శాబకమనోజ్ఞ నిన్ను
వినవలెననియు షడ్జస్వరమయూర వీరావు నిన్ను
కననేల విననేల యేటికీ రమ్యకాంక్షలు చేయు
నిను నన్నొకటిగాఁగ భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ ! 29

స్వామి ! నన్నొకసారి యిట్లు దయచూచెఁ బరముఁడన్నట్టి
యామాట కొందఱితోడ చెప్పితి ననుచుఁ గోపమ్మొ
ఆమెయి నీవైపు తిరిగిచూడవ యద్దిక్షమింపు
నీ మన్నన వచింప భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ ! 30

చత్రమ్ములో బిగించితివి యటుసిటు సాగనీకుండ
కుత్రచేసితి లేదు వీలు కాళ్ళీసికోఁ బులిమీఁది
పుత్రనా నిత్య మృత్యువు భయమిదేమి ముక్తి వ్రతంబు
నిత్రుపవాసముల్ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 31

ఏడువలేక నవ్వుటయ యొంచిన నీ సృష్టియెల్ల
కాఁడువాలగు నేటి కడుపులో నిల్లుకట్టినయట్లు
వేడి నిట్టూర్పులగాదె యిదిదని వెలయని బ్రదుకు
నేడె తెలియరాదు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 32

చివరి యీ దినములలోన నొకరీతి జీవనధార
సవదరింపఁగ సాయపడెడు పెంచి యాస జగదాధార
తవిలి నాలో సాయపడవె ననునేను దహియించుకొంచు
నివురు కప్పికొనంగ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 33

వేతప్పుచేయును మరి క్షమింపఁగావేడుఁ గన్నీళ్ళ
నీతిబాహిరుఁడైన వాఁడు నేను నా నీతిగాఁగలన
చేతో నియమ సర్వధర్మ పాలకా ! శ్రీరామ ! నాకు
నీతోలగించునా! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 34

(9)

కొడుకు కాంతారమ్మ చనిన నసువుల గ్రుంకె నీ తండ్రి
కొడుకు తా నసువులఁ గ్రుంక నేనింత గ్రుంక నీ పేరు
కొడుకుకుఁ బెట్టితి వాని బ్రదికించికొనను నిన్ గాద
నెడు తీవ్రతయు లేను భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 43

వసుధ నాకంటెను బుద్ధిమాలిన వాఁడు లేడనుము
పసివాడు వానిపైఁ బ్రాణములు పెట్టి బ్రదికితి వాడు
నుసియయ్యె మేనితో నేనుమాత్రము నుసికాను దుఃఖ
నిశవేఁగ నీయను భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 44

ఏడుపులో నట్టయడుగు నందున నెక్కడో నీదు
జాడ కన్పించు నా యేడుపైన నిచ్చట నేడ్వలేను
వ్రీడామనోహరమూర్తి నిన్ను దర్శింతునంచనగ
నీడజ హరివాహా ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 45

నమ్మకమ్మనఁ గొంత యప్పువెట్టి పంటలమీఁదఁ దీర్చి
కొమ్మన్నటున్నది జగతి నీవు నాకును గానిపించి
నెమ్మదిగా నఘప్రతతిఁ దూల్చికో నీ, వనుమాత్ర
నెమ్మ నీ యెదలేదు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 46

తోరపుటెద బాధ కంప నాగళ్ళతో దమ్ముచేసి
నారుకట్టలు దగ్గరలుగ విసరినన్నను పైన చేని
యోరిమిఁగా నుంటి స్వామి! వెసవచ్చి యూడ్చుకోవయ్య
నీరిమెండకయమున్ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 47

అది కాని దానియందున నకట! అదియదియను బుద్ధి
పొదలదు నాకైన దానియందు నా బుద్ధి యున్నటులఁ
బొదలుచుందును నేనుగాని మెలఁకువ పూర్తిగారాదు
నిదురయందున నుండి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 48

చేవ వెల్గు వెలుంగె, మరియు చీఁకటి చీఁకటే, రెండు
నా వెల్గు చీఁకటుల్ కలిసి యుండుట యన్నది లేద
యో వేధ! గ్రుడ్డివెల్తురని లోకాన నున్నది స్వామి!
నీ వొప్పుకోవంటె భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 49

నిను నింతగా దలంచియు ప్రమాణమ్ము నేరను, జీవి
యనుభూతికిం బ్రమాణమ్ము లేదు నీదగు దయ కాక
యనువుగాఁ గొలువవే వేసి యెన్ని నీ యడుగులు కలదో
నెనరొప్ప నా భక్తి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 50

నాలోతు తెలియును నాకు, నేడ్చుట నాయెద ప్రస్ని
లోలపై యుబికెడు గ్రుడ్లనీర్గ్రుడ్లలో గ్రుక్కుకొనుట
ప్రాలు సంజలఁ బొద్దుపొడుపువేళల రాపుపొందుటయు
నీలోఁతు తెలియక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 51

ఒనరగా నల్వురు నన్నుఁజూచి యయ్యో పాపమంచు
ననిపించుకోలేన బయటి నా వ్యవహార నిష్ఠతయు
ననుఁగట్టు పొగరుబోతనియ యనిపించు నా గుండెప్రయ్యు
నినునెంచుచునుగూడ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 52

నీటికొలంది తామర జగత్తేమి నీవేమి? భేద
మో టోఁకుబేరమునీది చిల్లర యుర్విది యెంత
టాటోటు బ్రదుకయ్యె నిమ్మనియడుగుటయె చాలు నెంత
నీటు చూపింతురు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 53

నిలచినవాడను నిలచినట్లుగ నీవెల్గు గ్రమ్మ
శిలను గానాయె బూడిదయుఁగా నాయె జెందించవంత
వెలుఁగునాపై రాతి నెలఁతఁ జేసితివి మనుష్యు శిలగ
నిలుపంగఁజాలవో భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 54

ఓయి బాబోయి ! తావెలికి వచ్చుటయును నెంత తేలి
కో యల్లి లోనికిఁ బోవుటంత కాదోయి నా స్వామి
శ్రీ యేచ ద్వారబంధాల్బిగించి రాసీరు దేవతలు
నీ యాజ్ఞ లేకుండ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 55

నీదయ నీదయ నీదయ మరొండునేరను త్రోవ
కాదని జన్మలెత్తింపు చంపెదు కాంతా సుతులను
వే దరిద్రుని రోగిఁజేతు చేసికోవే రమా రమణ
నీదయ కానిమ్ము భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 56

నా జీఱ యెఱుఁగుదు వీవు రామచంద్రా ! మొండివాఁడు
రాజుకన్నను బలవంతుఁడు బిగింపు రవ్వంత ఫలము
తేఁజాలదెందుకు గాని దిగవయ్య దిగు సంచరన్మ
ణీజాల రుచిహాస ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 57

నాది యేమున్నది ప్రతి నిమేషమ్మున నన్నెను సిద్ధ
మే దాని వ్యవహారమేమొ చూచికొమ్మీవు చూచుటకు
లేదందువా దానికైన సిద్ధమే లేకపోనిమ్ము
నీదేది కాదందు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! 58

